# ఆంధ్రపత్రిక

317022

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol 34 No 316 TUESDAY 9th MARCH 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao



# "సర్వశక్తిని కేంద్రీకరించి అత్యధిక ఉత్పత్తిని సాధించాలి"

## లేకపోతే మన ఆశలన్నీ నిరాశలు కాగలవని డా॥ శ్యాంప్రసాద్ ముఖర్జీ హెచ్చరిక

న్యూఢిల్లీ, మార్చి 7: ఇండియా ప్రభుత్వ పారిశ్రామిక, సప్లయిశాఖమంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ గారు నేటి రాత్రి ఆల్ ఇండియా రేడియో నుండి ఉపన్యాసము గావించుచు సంపూర్ణమగు పారిశ్రామిక శాంతి అవసరమని నుడివిరి. ఉత్పత్తి హెచ్చించుటకు సర్వశక్తులు కేంద్రీకరింపవలెనని ఆయన ఉద్బోధించుచు ఇట్లు చేయనియెడల మన ఆశలు, ఆశయములు సంపూర్ణముగా భగ్నమైపోవుననిరి:



మనకు చేకూరిన స్వాతంత్ర్యమును దృఢపరచుకొనవలసియున్నదని, మనమందరము కలిసి, అందరి మేలుకొరకు పనిచేయనంగీకరించినప్పుడే, దేశములో శాంతిసఖ్యతలను పెంపొందించుటకు సర్వశక్తులు కేంద్రీకరించినప్పుడే మనము స్వాతంత్ర్యమును దృఢపరచుకొనగలమని ఆయన చెప్పెను. దేశము కష్టముల నెదుర్కొనుచున్నదని, ఇందువల్ల ఏర్పడిన నిరాశ, నిస్పృహ మహాత్మునిమరణము చేయును మండించినవని, నిరోధించ దేశము అధికముగా అత్యంతకష్ట మస్థితిలో నున్నదని డా॥ ముఖర్జీ గారు చెప్పుచు ఆత్మసంతృప్తికి తావులేదని, ... (బాగా అస్పష్టం)

వ్యాపారకర్మాగారాల్లో అలసటను ... దేశములో ... ప్రజలు ... ఉత్పత్తి తగ్గినదని, మనము

(3-వ పేజి చూడుడు.)

# మనదేశానికి మహోజ్జ్వలభవిష్యత్తు ఉన్నదని మౌంట్‌బాటెన్ విశ్వాసం

## అపారసహజసంపద; అసంఖ్యాక ప్రజాబలం ఉపయోగపడాలని ఉద్బోధ

### ప్రముఖనాయకులకు ఢిల్లీ విశ్వవిద్యాలయ బిరుదుల బహూకరణ

న్యూఢిల్లీ, మార్చి 7: ఇండియా గవర్నర్ జనరల్ లార్డ్ మౌంటుబాటన్ ఢిల్లీ విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భాన నేడిక్కడ ఉపన్యసిస్తూ ఇలా అన్నాడు: "ప్రపంచమందలి మహోత్కృష్ట దేశాలలో ఒకటైన భారతదేశముయొక్క రాజధానీ నగర విశ్వవిద్యాలయం జాతీయజీవితంలో అత్యంత ప్రముఖమైన పాత్రను వహించవలసి ఉన్నది. భారతజాతియొక్క భవితవ్యానికి రూపు రేఖలు దిద్దడంలో దేశమందున్న వివిధ విశ్వవిద్యాలయాలు నిఖిల విద్యాసంస్థలూ తమకున్న అశేషమైన విధి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించవలసి ఉన్నది.

సామాన్య ప్రజానీకముయొక్క జీవన ప్రమాణమును అభివృద్ధి చేయాలన్నదే ప్రభుత్వంయొక్క లక్ష్యం. ఈ ఆశయాన్ని ఆచరణలో పెట్టడానికి సంఘసేవకులు కార్యకర్తలు అసంఖ్యాకంగా కావలసివస్తారు. విశ్వవిద్యాలయాలలోని విద్యార్థులే ఈ అవసరాన్ని తీర్చవలసి ఉన్నది.

లార్డు మౌంట్‌బాటన్ తమ ఉపన్యాస క్రమంలో ఇంకా ఈవిధంగా చెప్పారు. ఢిల్లీ విశ్వవిద్యాలయముయొక్క చాన్సలర్‌గా నేను ఈ స్నాతకోత్సవ సభకు అధ్యక్షత వహించి భారతదేశమందలి మహాపురుషులలో కొందరికి, అందులో ముఖ్యంగా మన మహామాన్యులైన ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూకు, గౌరవ బిరుదములను సమర్పించే మహాభాగ్యం పొందడం నాకు చాలా ఆనంద జనకంగాను గర్వ కారణంగాను ఉన్నది. ఢిల్లీ విశ్వవిద్యాలయం, నాకు కూడా డాక్టర్ ఆఫ్ సైన్స్ బిరుదం ప్రసాదించినందుకు సంతోషిస్తున్నాను. విశ్వవిద్యాలయము యొక్క కోర్టు వర్గమూ అకాడెమిక్ కౌన్సిలూ ఇటీవల గాంధీజీ నిర్యాణాన్ని గురించి కావించిన సంతాప తీర్మానంలో చివర ఈ వాక్యాలు ఉన్నవి. ఈ వాక్యాలు నాకు చాలా అవసరోచితంగాను యుక్తంగాను కనిపించినవి:— "గాంధీజీ నిర్దేశించిన ఉత్తమ ఆదర్శాన్ని అనుసరించి, దేశంలోని వివిధ

6 వ పేజీ చూడుడు



## డొడెకనీస్ దీవులు గ్రీసు వశం

ఏథెన్సు, మార్చి 7: పూర్వపు టర్కీ సుల్తాన్ సులేమాన్ అను నాతడు 1522 లో గ్రీసునుండి జయించిన 50 డొడెకనీస్ ద్వీపాలను (ఈజియన్ సముద్రంలో నివి) నేడు తిరిగి గ్రీసునాకి అధికార పూర్వకముగా యిచ్చివేయడమైనది.

## మద్రాసు శాసనసభ కాంగ్రెస్ పార్టీ నాయకత్వం

చెన్నపురి, మార్చి 8: మద్రాసు శాసనసభ కాంగ్రెస్‌పార్టీ నాయకత్వానికి పోటీగా జరుగు ఎన్నిక ఈ సంవత్సరం మార్చి 26 వ తేదీని జరుగగలదని తెలియుచున్నది. మార్చి 25 లో శాసనసభలో బడ్జెట్ గ్రాంట్లు పూర్తికాగలవు.

# కాశ్మీర్ విషయంలో భద్రతా మండలి దిగివస్తుందా?

## అమెరికా సూచిస్తున్న కొత్తపరిష్కారమార్గం

లేక్‌సక్సెస్, మార్చి 7: భద్రతామండలిలో రేపటి సమావేశమందు కాశ్మీర్‌పై చర్చ ప్రారంభం అయినప్పుడు, సమస్యా పరిష్కారానికి ఒక కొత్తమార్గం సూచించబడుతుందని విశ్వసనీయంగా తెలియవచ్చింది.

ఇండియా పాకిస్థాన్‌లకు ఉభయులకు అంగీకారయోగ్యమైన పరిష్కార మార్గం ఒకటి కనిపెట్టాలన్న ఉద్దేశ్యంతో అమెరికా ప్రతినిధివర్గం భద్రతామండలిలోని మిగతా దేశాల ప్రతినిధులతో గడచిన కొలది రోజులుగా తీవ్రంగా సమాలోచనలు జరిపిందని తెలుస్తున్నది.

ఈ నూతన పరిష్కారమార్గం యొక్క వివరాలు ఇంకా బైటపడలేదు; కాని దాని స్థూలస్వరూపం ఇలా ఉండవచ్చునని తెలుస్తున్నది:

(1) ఇండియా పాకిస్థాన్‌మీద చేసిన ఫిర్యాదులో కొంత సత్యం లేకపోలేదనీ, కాశ్మీర్‌మీదికి దండెత్తివచ్చిన దుండగీళ్లకు పాకిస్థాన్ ప్రభుత్వం ప్రత్యక్షంగా సహాయం చేసి ఉండకపోయినా, వారికి పరోక్షంగా ప్రజలద్వారా తోడ్పాటు లభించి ఉండవచ్చుననీ, భద్రతా మండలి నిర్ణయిస్తుంది.

(2) జనవాక్య నిర్ధారణ జరిగేముందు, షేక్ అబ్దుల్లా నాయకత్వమున్న ప్రస్తుత తాత్కాలిక ప్రభుత్వాన్ని మిగతా రాజకీయ పక్షాలకుకూడా స్థానం ఇచ్చి విస్తరింపచేయాలి.

(3) భారతీయ సేనలను కాశ్మీర్‌లో ఉండనివ్వవచ్చును, కాని వాటికి మిలిటరీ విధులుతప్ప సాధారణ పోలీసు విధులు అప్పగించకూడదు. అయితే ఈ పరిష్కారమార్గానికి ఒక నిరమైన తీర్మానస్వరూపం ఏదీ ఇవ్వబడలేదనీ, భద్రతా మండలిలో జరిగే చర్చలధోరణినిబట్టి దీంట్లో యథేచ్ఛగా మార్పులు చేయబడవచ్చుననీ తెలుస్తున్నది.

# భాషారాష్ట్రనిర్మాణవిషయంలో కర్ణాటక, మహారాష్ట్ర కాంగ్రెస్ కృషి

## ఇతరప్రాంత కాంగ్రెసు సంఘాలతో సరిహద్దు సమస్యల చర్చకు ప్రత్యేక కమిటీల స్థాపన

బొంబాయి, మార్చి 7: ఐక్య మహారాష్ట్ర స్థాపనకు మార్గం కనిపెట్టగలందులకై మహారాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఒక రాయబార సంఘాన్ని ఏర్పాటుచేసింది. ఈ సంఘం బొంబాయి, గుజరాత్, కర్ణాటకరాష్ట్ర కాంగ్రెసు కమిటీలు నియమించే రాయబార సంఘాలతో ఐక్యమహారాష్ట్ర సరిహద్దుల విషయమై రాయబారాలు జరుపుతుంది.

మహారాష్ట్ర రాయబార సంఘంలో ఈ క్రిందివారు సభ్యులుగా నియమింపబడ్డారు: కాంగ్రెసు కార్యదర్శి శంకర్‌రావ్ దేవ్; మహారాష్ట్ర కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు కేశవరావ్ జేథే; బి. ఎస్. హీరే; శంకర్‌రావ్ మోరే; ... (అస్పష్టం)

## మైసూర్‌తో రాయబారాలు జరపడానికి కర్ణాటక రాయబార సంఘం

హుబ్లీ, మార్చి 7: మైసూర్ విషయంలో రాయబారాలు జరపడానికి కర్ణాటక రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు ఎస్. నిజలింగప్ప ఒక రాయబార సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈ సంఘంలో

(6 వ పేజీ చూడుడు)

## జాతీయ పౌర సైన్య నిర్మాణం

### త్వరలో కేంద్ర ప్రభుత్వ ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 8: ఈరోజు బడ్జెట్ డిమాండ్లపై అధినివేశ శాసనసభలో చర్చ ప్రారంభమయినప్పుడు రక్షణ శాఖామంత్రి సర్దార్ బల్దేవ్‌సింగ్ గారు జాతీయ పౌర సైన్యనిర్మాణం విషయమయి వివరీకరిస్తూ ప్రభుత్వం త్వరలోనే ఒక ప్రకటన చేయబోతున్నదని ప్రకటించారు.

## కలకత్తాలో మౌంట్‌బాటెన్ దంపతులు

కలకత్తా, మార్చి 8: మౌంట్‌బాటెన్ దంపతులు ఈ అపరాహ్ణం విమానంలో ఢిల్లీనుంచి ఇక్కడికి చేరారు.

# అమెరికాలో శ్వేతజాతి అహంకారం

## ట్రూమన్ ప్రతిపాదించిన సమానహక్కుల చట్టంపట్ల దక్షిణ అమెరికనుల ఆగ్రహం

న్యూయార్కు, మార్చి 7: అమెరికా సంయుక్తరాష్ట్రాలలో తెల్ల జాతుల వారు అచటి నల్లజాతులవారగు నీగ్రోలను ఇతరవర్ణజాతులవారిని ద్వేషించి తమకంటె తక్కువ జాతివారుగా భావించి తమతో సమానమైన హక్కు అధికారములు లేకుండా చేసియున్నారు. ఇట్టి అక్రమమును తొలగించవలెనని ఎంచి సమాన పౌరస్వత్వములను శాసించెడి 10 సూత్రములను అమెరికా ప్రెసిడెంటయిన ట్రూమను వర్తింపజేయుటకు సంకల్పించియున్నాడు. అందువల అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని దక్షిణరాష్ట్రములవారు ఆగ్రహావేశులగుచున్నారు. నల్లజాతులవారిని ఇతర రంగుజాతులవారిని ఆదక్షిణ రాష్ట్రములో ఎక్కువగా ద్వేషించుచున్నారు. వీరికి ప్పుడు కలిగిన ఆగ్రహావేశము వల్ల వీరు ఇపటి నీగ్రోల దౌర్జన్యం చేయుదురో యని నీగ్రోలు భయపడుచున్నారు.

... కమ్యూనిస్టులు ప్రచారం చేయుచున్నారు. ఇటాలియను ... ఇటాలియను పౌరులను బ్రిటిషు పక్షీయులు సంహరించుచున్నారని కమ్యూనిస్టులు ప్రచారం చేయుచున్నారు. ఇటలీలో అమెరికావారు ఆటంబాంబుల గిడ్డంగులను యేర్పాటుచేయుదలంచియున్నారని ఒక కమ్యూనిస్టునాయకుడు ప్రకటించెను.

## ఇటలీ గతిఏమి?

### జెకోస్లోవేకియాలో కమ్యూనిస్టు ప్రభుత్వ ఫలితం

రోము, మార్చి 7: జెకోస్లోవేకియాలో కమ్యూనిస్టు ప్రభుత్వవర్గము ఏర్పడి అది రష్యాకు మిత్రమైన రాజ్యమైనది. ఇటలీలో ఒక కొత్త శాసనసభ (సెనెటుగా) ఎన్నికలు ఏప్రిల్ 18 తేదీని జరుగును. 2 కోట్ల 70 లక్షలమంది ఆనాడు వోట్లు యిచ్చెదరు. జెకోస్లోవేకియాలో జరిగినట్లుగా యిటలీలో కమ్యూనిస్టు ప్రాబల్యము వీర్పడజాలదని ప్రభుత్వ పక్షమువారు చెప్పుచున్నారు.

ఇటలీ ప్రధాన మంత్రియగు అల్సిడి డి. గ్యాస్పెరి ... లిబరలుపార్టీ కార్యదర్శి ... సిఫోర్జా గారు మాట్లాడిరి. జెకోస్లోవేకియాలో జరిగినటుగా యిక్కడ జరుగదని యీ సిఫోర్జా గారు అన్నారు.

రేపుజరుగబోయే ఎన్నికలలో 10 వేల మంది అభ్యర్థులున్నారు. 19 పార్టీల వారున్నారు.

కమ్యూనిస్టుపార్టీ ప్రచారం సాగించుచున్నది. ఇటలీకి యిదివరలో ... యున్నటువంటి రాజ్యము లన్నింటి మీదను దగ్గర ... ఇటలీకి లభించేయుట రష్యా యొక్క సంకల్పమైయు

# అమెరికా అధ్యక్షపదవికి ఎన్నిక

## డెమోక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా ట్రూమన్ పేరున మోదు

హారిస్బర్గ్ (పెన్సిల్వేనియా) మార్చి 7: అమెరికా అధ్యక్షు పదవికి జరుగనున్న ఎన్నికల సందర్భములో డెమొక్రెటుపార్టీ తరఫున పెన్సిల్వేనియా పరగణానుంచి అభ్యర్థిగా నిర్ణయింపబడు నిమిత్తమై ప్రస్తుతము ప్రెసిడెంటుగా నున్న ట్రూమను పేరు నామినింపబడెను. పెన్సిల్వేనియా పరగణాలో యీ ప్రాథమిక ఎన్నిక ఏప్రెలు 27 తేదీని జరుగును.

ప్రెసిడెంటు ట్రూమను విశ్రాంతికొరకై ఫ్లోరిడా పుర్లో ... కీ వెస్టులో వినోద కాలక్షేపము చేసి తిరిగి వాషింగ్టను నగరానికి వచ్చెను.

ఆయురోపాఖండ పశ్చిమ రాజ్యాల మాట ఉనంగు అమెరికా ప్రత్యేకంగా ... కల్పించుకొని చేరవలె ... ఆ ... శక్తి ... చేస్తే ... ఈ విషయమై ట్రూమను వెంటనే నిర్ణయించవలసియున్నది. అమెరికా వారి మాటకు అడుగుదాటకు ... యూరోపియను ... రాజ్యాలు స్వీకరించుచున్నవని కమ్యూనిస్టులు నిందించుచున్నారు.



ట్రూమను తిరిగి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడును మార్షలు పథకం అమెరికా పార్లమెంటు చేపట్టనే అమోఘ పబకం కొలహాలను ... ట్రూమను సంకల్పములు నెరవేరుటకు ఉత్తరోత్తర అవకాశము లుండకపోవచ్చును

## ప్రకటన

9 వ తేదీ మంగళవారం మహాశివరాత్రి. కార్యాలయమునకు సెలవు. కనుక 10 వ తేదీ గల పత్రిక వెలువడదు.

మేనేజరు.

## గంటల పంచాంగం

సర్వజిత్ నం॥ మాఘ బ॥ చతుర్దశి 1948 సం॥ మార్చి 9 మంగళవారం

మం॥ చతుర్దశి రా 12-41 శని శ 9-58 నక్షత్రం సా 5-58 ల 7-44 వ మహాశివరాత్రి.

బ॥ అమా॥ మార్చి 10 బుధవారం

బు॥ అమా॥ రా 2-43 శత శ 12-37 నక్షత్రం రా 7-39 ల 9-25 వ.

ఆంధ్రపత్రిక

సర్వజిత్ నం॥ మాఘ బ॥ చతుర్దశి

మంగళవారము

## భాషారాష్ట్ర నిర్మాణం

రాజ్యాంగ రచనాసంఘము పరిషత్తు అధ్యక్షునకు సమర్పించిన రాజ్యాంగ ముసాయిదాను చర్చించి ఆమోదించుటకు రాజ్యాంగ పరిషత్తు త్వరలో సమావేశము కానున్నది. సమావేశారంభమునకు మరొక మాసము. మాసములకంటె వ్యవధి లేదు. రాజ్యాంగమును పరిశీలించి, ఆమోదించుటకు ఒకటి రెండు మాసములకంటె ఎక్కువ వ్యవధి అవసరము ఉండదు. కనుక అప్పుడే మాసములలోపునే "సర్వాధికార సమన్విత ప్రజాస్వామిక భారత సమితి" అవతరణ జరుగ గలదు. కాని నూతన రాజ్యాంగము అమలు జరుగుటకు ఎంతకాలము పట్టునో ప్రస్తుతము అందనా వేయుట సాధ్యముగాదు. 1949 వసంతము నాటికి నూతన రాజ్యాంగము ననుసరించి ఎన్నికలు జరుగగలవని కొందరు భావించుచు. దీని ఆ ప్రకారముగనైనను నూతన రాజ్యాంగము అమలు జరుగుటకు ఒక సంవత్సరమే వ్యవధియున్నది

అధినివేశ ప్రభుత్వ మిప్పటి వరకు రాజ్యాంగ రచనాసంఘము భాషారాష్ట్ర నిర్మాణము విషయమున చేసిన సూచనను అంగీకరించి ఆ ప్రకారము పని ప్రారంభించి యుండలేదు. రాజ్యాంగ రచనా సంఘము ఆశించినట్లు నూతన రాజ్యాంగమును పరిషత్తు ఆమోదించుటకు ముందుగనే ఏ యే భాషా రాష్ట్రముల నిర్మాణము జరుగవలెనో స్పష్టము కావలెనన్న, రాష్ట్రముల జాబితాలో ఇవి చేరిలోగడ సింధు, ఒరిస్సా రాష్ట్రములవలె ఆంధ్ర కర్ణాటక, కేరళ, మహారాష్ట్ర రాష్ట్రము ఏర్పడవలెనన్న, అధినివేశ ప్రభుత్వము ఉపసంఘసూచనను అనుసరించి వెంటనే పని ప్రారంభింపవలసి యున్నది

లోగడ ఆచార్య రంగాగారి అధ్యక్షవద్ధి ప్రశ్నకు సమాధానము అధినివేశ శాసనసభయందు ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ చేసిన ప్రకటన అనంతరము, భాషారాష్ట్ర నిర్మాణము విషయమై ప్రభుత్వ వైఖరి ఎట్లున్నది స్పష్టము కాలేదు. నాటి ప్రకటనను బట్టి రాజ్యాంగ పరిషత్తు నూతన రాజ్యాంగమును ఆమోదించుటలో పున ప్రభుత్వ మేమియు చేయ తలపెట్టనట్లు స్పష్టమైనది. నూతన రాజ్యాంగమున ందలి రాష్ట్రముల పట్టికయందు ఆంధ్ర రాష్ట్రమునుకూడ చేర్పించి, అనంతరము 1935 వ చట్టము ననుసరించి సింధు, ఒరిస్సా రాష్ట్రము లేర్పడినట్లే ఆంధ్ర రాష్ట్రము కూడ ఏర్పడునట్లు చేయుటకు రాజ్యాంగము ఆమోదింపబడిన వెంటనే అవసరమైన చర్య తీసుకొందుమని ప్రధానామాత్యుడు వాగ్దాన మిచ్చియుండెను. పరిషత్తు రాజ్యాంగమును ఆమోదించిన నాడే ఇప్పటి చట్టము రద్దయి నూతన రాజ్యాంగము ప్రారంభమగును కనుక నూతన రాష్ట్రముల నిర్మాణము నూతన రాజ్యాంగము ననుసరించియే జరుగవలసి యుండును. అట్టి సందర్భములో భాషా రాష్ట్రములు నూతన రాజ్యాంగారంభముతో గాక నూతన రాజ్యాంగము అమలు జరుగునాటికి ఏర్పడవచ్చునని ప్రధానామాత్యుడు తెలిపినపద్ధతి ఇదే; నూతన రాజ్యాంగము ప్రారంభమైన 1935 ఇండియా ప్రభుత్వ చట్టము సెక్షన్ 290 ననుసరించి రాష్ట్ర నిర్మాణము జరుగుటకు వీలులేదు. భారత సమితి పార్లమెంటు శాసనము ద్వారా నూతన రాష్ట్రము లేర్పడవలసి యున్నది.

1935 వ సంవత్సరము భారత ప్రభుత్వ చట్టమునందలి 290 వ సెక్షను ప్రకారము రాష్ట్రమేర్పడుట జరిగిన రాజ్యాంగ పరిషత్తుతో గాని, నూతన రాజ్యాంగముతో గాని నిమిత్తము లేదు. రాజ్యాంగ రచనాసంఘము రాష్ట్రముల జాబితాలో ఇతర రాష్ట్రములతోబాటు చేర్చవలసి యుండును 1935 వ చట్టమును మార్పు చేయవలసి యుండును. 1935 శాసనము మేరకు ఆంధ్రరాష్ట్రము చేర్పవలసి వచ్చును. ఈ పనిని కేవలము అధినివేశ శాసనసభయే చేయగలదు. ఏమైనను నూతన రాజ్యాంగారంభముతో రాష్ట్రమేర్పడవలెనన్న 1935 వ చట్టము ననుసరించి వెంటనే సరిహద్దు నిర్ణయసంఘము ఏర్పడి ఆ సంఘకలాపము పూర్తియైన వెంటనే 290 సెక్షను ప్రకారము నూతన రాష్ట్రము ఏర్పాటు కావలెను అట్లుగాక నూతన రాజ్యాంగము అమలు జరుగుటతో రాష్ట్రమేర్పడవలెనన్న నూతన రాజ్యాంగము ననుసరించి "తాత్కాలిక" ప్రభుత్వము వ్యవస్థ తీసుకొనవలెను. ఉపసంఘమువారు రాజ్యాంగ పరిషత్తు ముసాయిదా నామోదించుటకు పూర్వమే పూర్తి కావలెనని రచనాసంఘము సూచించియున్నందున రాజ్యాంగారంభమునకు పూర్వమే 1935 చట్టము ననుసరించియే నూతన రాష్ట్రనిర్మాణమున కెట్టి ప్రతిబంధకములును ఉండజాలవు.

అధినివేశ ప్రభుత్వము రాజ్యాంగ రచనాసంఘము సూచనను అంగీకరించి వెంటనే విచారణసంఘమును నియమించి, ఆ విధముగ ఏర్పాటైన ఉపసంఘము తన నివేదికను రాజ్యాంగ పరిషత్తు నూతన రాజ్యాంగమును ఆమోదించుటకు పూర్వము సమర్పించిన ఆంధ్రరాష్ట్రము, తదితర భాషారాష్ట్రములు రాష్ట్రముల జాబితాలో చేరి రాజ్యాంగము అమలు జరుగునాటికి గాని, అమలు జరుగుటతో గాని విశిష్ట రూపము దాలవు. అట్లుగాక ఉపసంఘ నియామకము ఆలస్యమైనగాని, ఉపసంఘము తనపనిని పూర్తి చేయలేక పోయినగాని, రాష్ట్రముల జాబితాలో నూతన రాష్ట్రములను చేర్చుటకు వీలుండదు. అనంతర నిర్మాణము 'తదనంతర' ప్రభుత్వ ఇష్టాయిష్టములపై ఆధారపడి యుండును. ఇప్పటి ప్రభుత్వమైనను సత్వర ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు సుముఖముగ లేకున్న ఇతరలో విచారణసంఘమును నియమింపక పోవచ్చును. నియమించినను పనిపూర్తియగుటకు గడువు పెట్టకపోవచ్చును. ఏమైనను రాజ్యాంగ రచనాసంఘమువారి ప్రకటనవల్ల ఏర్పడిన అపోహలను తొలగించుటకు అధినివేశ ప్రభుత్వము తన వైఖరిని విస్పష్టము చేయవలసి యున్నది.

అది పూర్వ ప్రకటనల పునరుద్ఘాటన చేయుట ద్వారా గాక సరిహద్దు నిర్ణాయక, ఆస్తిపాస్తుల విభజనసంఘముల తక్షణము నియమించుట ద్వారా జరుగవలెను అప్పుడే ప్రధానామాత్యుని ప్రకటన ప్రభుత్వసంకల్పమునే వెల్లడించినదని విశ్వసింప వీలగును. ప్రభుత్వ సంకల్పశుద్ధిని శంకింప నవసరముండదు.

ఆంధ్రరాష్ట్రము విషయమై అధిగమింపసాధ్యముగాని యెట్టి అవరోధములు లేవని, నూతన రాజ్యాంగము ఆమోదింపబడిన వెంటనే రాష్ట్రనిర్మాణమున కవసరమైన చర్యలు తీసుకోవడ మాత్రముండనని నవంబరు 27 వ తేదీన ప్రధానామాత్యుడు ప్రకటించియుండెను కనుక రాజ్యాంగ రచనాసంఘమువారు ఇతర భాషారాష్ట్రములను, ఆంధ్ర రాష్ట్రమును గురించి విచారణ జరుపుటకు ప్రత్యేక ముగా ఉపసంఘమును నియమింపవలెనని సూచించుటలో అర్థము లేదు. ఇందుకు సంబంధించి ముసాయిదాలో మున్న భాగము సవరింపబడవలెను ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు తగిన చర్యలను సూచించి, ఇతర భాషారాష్ట్రముల విషయమై విచారణ జరుపవలెనని అధినివేశ ప్రభుత్వము విచారణ సంఘమును నాదేశింపవలెను.

విచారణను గాని, నిర్ణయమును గాని ఆలస్యము చేయు ఉద్దేశ్యము ప్రభుత్వమునకు లేదని ప్రధానామాత్యుడు నవంబరు 27 వ తేదీన స్పష్టము చేసెను కాని ఈ పని (భాషా రాష్ట్ర నిర్మాణము) ప్రధానముగ రాజ్యాంగ పరిషత్తునకు సంబంధించినదని, ఇందు విషయమై తగు చర్య తీసుకొనవలసిందని ప్రభుత్వము పరిషత్తును కోరునని పండిట్ నెహ్రూ వాగ్దానము చేసెను. రాజ్యాంగ పరిషత్తే నేడు ప్రభుత్వమునకు ఒక సూచన చేసెను. ఆ ప్రకారము ప్రభుత్వము వెంటనే ఉపసంఘమును నియమింపవలెను. ఆంధ్రరాష్ట్రము విషయమున లోగడ పండిట్ నెహ్రూ వెల్లడించిన భావముల కనుగుణముగ ఈ కమిటీ నాదేశింపవలెను. పండిట్ నెహ్రూ ప్రధానామాత్యపదవిలో ప్రథమముగ 14 వ తేదీ ఆంధ్ర దేశము వచ్చుచుండెను. ఆ నాడు ప్రధానామాత్యు డీవిషయమున ప్రభుత్వ వైఖరిని స్పష్టము చేయుచు ఒక ప్రకటనము చేయుట సమంజసముగ నుండును.

## ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణం

### శాసనసభలో కొత్త ప్రతిపాదన

చెన్నపురి, మార్చి 8: మద్రాసు అసెంబ్లీలో నేడుదయం బడ్జెట్ డిమాండ్లపై విపులంగా చర్చ ప్రారంభమైంది.

నేటి శాసనసభా కార్యక్రమంలో ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వ కార్యాలయం మంత్రుల డిమాండు నిర్ణయమైంది. ఈ డిమాండుకు 18 కోత తీర్మాన నోటీసు లివ్వబడినవి. ప్రభుత్వవిధానం చర్చించుటకు కోతతీర్మానములు ప్రతిపాదింపబడుచున్నట్లు మొత్తం 12 గ్రూపుల ప్రతికూలపక్ష సభ్యులు, 5 గురు కాంగ్రెసు సభ్యుల పేర్ల వీటిండాలో ఇవ్వబడినవి.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు సత్వర ఆంధ్రరాష్ట్రనిర్మాణావసరం సూచించుటకు ఒక కోత తీర్మానము ప్రతిపాదించదలచినట్లున్నది. కర్నూలు, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో అల్పసంఖ్యాకులపట్ల ప్రభుత్వవైఖరి చర్చించుటకు అబ్దుల్ హమీద్‌ఖాన్‌గారు ఒక కోత తీర్మానం ప్రతిపాదించారు.

మంత్రుల వేతనాలను గురించి చర్చించుటకు శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు, మంత్రుల సంచార కార్యక్రమాలపై వచ్చిన స్వల్పధనంగురించి చర్చించుటకు అబ్దుల్ సలాంగారు కోత తీర్మానములు ప్రతిపాదించినట్లు ప్రకటించారు.

పోలీసు డిమాండు కింద 25 కోత తీర్మానా లున్నాయి. వీనిలో నైజాం సరిహద్దులో పోలీసు బందోబస్తు హెచ్చించవలసిన అవసరం సూచిస్తూ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీవత్తి వెంకటసుబ్బయ్య మొదలగువారు ప్రతిపాదించినవి చాలా ఉన్నవి.

### కాంగ్రెస్ సభ్యుల కోతతీర్మానాలు

బడ్జెట్ డిమాండ్‌పై కాంగ్రెస్ పార్టీ సభ్యులు కోత తీర్మానాలు ప్రతిపాదించవచ్చుననీ, కాని చర్చ అనంతరం వానిని ఉపసంహరించుకో వలసి యున్నారనీ, చర్చలో కూడా ప్రభుత్వంపై తీవ్ర విమర్శలు చేయరాదనీ, ప్రభుత్వానికి సహాయకరమగు సూచనలు చేయుటకు ఈ కోత తీర్మానములు ప్రతిపాదించవచ్చునని కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ సభ్యులకు ఈ తరువు చేసింది. కేంద్ర శాసనసభలో ప్రస్తుతం ఈ పద్ధతి అనుసరించ బడుతున్నదట. ఈ నిర్ణయం అనుసారమే శ్రీ కాళేశ్వరరావుగారు మొదలగు పలువురు కాంగ్రెస్ సభ్యులు కోత తీర్మానాలను ప్రతిపాదించారు.

డా॥ సుబ్బరాయన్ 1948-49 కి శాసనసభ గ్రాంట్లను శాసనసభ అనుమతికి అర్పిస్తూ ప్రవేశపెట్టారు. తీర్మానం ఆమోదింపబడింది

కబ్జాత రాష్ట్రప్రముఖాధికారులకు, మంత్రులకు, ఇతర అధికారులకు ఖర్చుల క్రింద రూ 58,71,800 గ్రాంటును ఇచ్చారు.

మోయిద్దీన్ కుట్టిసాహెబ్ నూరు రూపాయల కోత తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ, ప్రభుత్వ విధానాన్ని విమర్శించారు. ఇది మతసంబంధమైన ప్రభుత్వం కాదంటూనే, మత విభేదాల్ని చూపిస్తున్నారు. ముస్లింలను హీనంగా చూస్తున్నారు. హరిజన, బ్రాహ్మణులను హీనంగా చూస్తారు! చివరకు మంత్రుల్ని ఏ కోటంలో కూడా కులతత్వాలు, జిల్లాల విభేదాలు, అభిప్రాయం అందరికీ తెలుసు

ప్రభుత్వపరిపాలనా విధానాన్ని చర్చించు కోత తీర్మానం ప్రతిపాదిస్తూ శ్రీ వి వెంకటేశ్వర్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో జరుగుతున్న జాప్యానికి రాష్ట్రప్రభుత్వవిధానాన్ని విమర్శించారు. దీనికి ప్రధాన నగరం విషయమై ప్రసరించిన వివాదం పేరుచెప్పి కారణ చూపును. అయితే చెన్నపట్నం తమిళులకే చెందుతుందని సమీప ప్రాంతాలన్నీ తమిళులకేనని శ్రీ వెంకటేశ్వర్లుగారు తమ అభిప్రాయం తెలిపారు. చెన్నరాష్ట్రం లోని "జాతుల" కు విడివిడి రాష్ట్రాలు ఏర్పడాలి. అప్పుడే మాతృభాషలో పరిపాలనకు వీలుకలుగుతుంది. ఆంధ్రరాష్ట్రానికి, నిజాం రాష్ట్రాలు, హైదరాబాదు ముఖ్యపట్టణంగా ఉండగలదు. నైజాంలో స్వాతంత్ర్యంకోసం కమ్యూనిస్టులు ప్రజాపోరాటం సాగిస్తుంటే పాటీ స్టేటుకు త్రిగాద దొంగలనాల్ని, బందిపోట్లను, కమ్యూనిస్టులకు అంటకడుతున్నారు. ఎవరో అసంతృప్తులైన కొందరు కాంగ్రెసువాదుల మాటలవిని, కమ్యూనిస్టు పార్టీని అణచివేయటానికి కుట్రజరుగుతోంది. మన పోలీస్ మంత్రిగారు సంస్థానాధీశుల మిత్రుడు. ఈయన ఇదివరకు కాంగ్రెస్ స్వాతంత్ర్య పోరాటాన్ని నశింపజేసిన వ్యక్తి. ఈయన ప్రజల మనిషి కాడు. సోషలిస్టు-కమ్యూనిస్టు పార్టీని అణిచేస్తే, అణిచేవారు విశాలాంధ్ర అనే మహోత్కట ఆదర్శం ఊపందుకొనగ తీవ్రమౌతుందని శ్రీ వెంకటేశ్వర్లు అన్నారు.

జనాబ్ ఖాజాఖాన్ ప్రసంగాన్ని విమర్శిస్తూ, ప్రధాని ఈ సంవత్సరంలో అసెంబ్లీలో రెండుసార్లు ప్రసంగించారు. ఈ ప్రధానికి ఇక్కడ ఏం జరుగుతోందో తెలియదు. (ఇంతలో ప్రధాని వచ్చారు) అనుకుంటూ ఉండగనే వచ్చారు. ప్రధాని అసెంబ్లీ సభ్యులను సవ్యంగా గౌరవించటం లేదు. ప్రకాశంగారు ప్రధానిగా ఉన్నప్పుడు, అసెంబ్లీలోకి వచ్చే మొదటివ్యక్తి ప్రకాశంగారు-బయటకువెళ్ళే చివరవ్యక్తి కూడా ప్రకాశంగారే. పైగా మన ప్రధాగారిని దర్శించటానికే అవకాశం లేదు. దర్శనానికి వెళ్ళినవారిని "పోంగో-పోంగో!" అంటారట. ఈ బ్రోస్టే సెంటర్ జార్జి గోడ వద్ద తలకాయను కొట్టుకుంటే కొంత ప్రయోజనం ఉంటుంది—కాని మన ప్రధాని అంతకంటే తక్కువ. ప్రధానిగారి ఫైళ్లను —రహస్య రికార్డులను ఆయన కార్యదర్శులు చూస్తారు. ఇది చాలా అక్రమం. ప్రధాని, రహస్య రికార్డులను తానే చూడకోవాలి. చివరకు పాపం—డా॥ సుబ్బరాయన్, ప్రధాని బదులు మాట్లాడాల్సి వచ్చింది. డా॥ సుబ్బరాయన్ మాకే మైనా సహాయం చేయదల్చుకుంటే, అన్నిటికి ప్రధాని అడ్డువస్తున్నాడు. ప్రస్తుతం గవర్నర్ అధికారాలన్నీ, ప్రధానికి సంక్రమించాయి. ఈ సంవత్సరంలో ఈ మంత్రివర్గం చేయగలిగిన మహోత్కార్య లేవో తెలపమని కోరుతున్నాను. ప్రతి అధికారికి మంత్రివర్గంవారంటే భయం. ప్రభుత్వ సిబ్బందిలో కులతత్వాల ప్రవేశము మూలంగా కొందర్ని నానాబాధలు పెట్టున్నారు. మంత్రులైనా మంచిపనులు చేయాలని చూస్తే, ప్రధాని సైంధవుడులాగా అడ్డుపడుతున్నాడు ఈ ప్రధాని రాష్ట్రాన్ని నాశనం చేస్తున్నాడు న్యాయశాఖలో ప్రభుత్వపు జోక్యం ఎక్కువైపోతోంది. చివరకు ప్రధాన న్యాయమూర్తి రాజీనామా ఇవ్వాల్సివచ్చింది ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ప్రధాని శాస్త్రీ ఉద్యోగాలని రజాఖాన్‌గారన్నారు.

శ్రీ నాగప్ప కోతతీర్మానాన్ని బలపరుస్తూ హరిజనుల కష్టాలు తొలగించలేదన్నారు. ఇంకా హరిజనులకు హోటళ్లలోకి, చెరువులవద్దకు రానివ్వటంలేదు. నైజాం సరిహద్దుల్లో ప్రజలకు రక్షణ లేకపోయింది. స్త్రీలను చెరుస్తున్నారు. ఖూనీలు జరుగుతున్నాయి. లూటీలకు అంతులేదు కాని ఈ ప్రభుత్వం ఏంచేస్తోంది—ఏమీ లేదు. సిగ్గు!—సిగ్గు! (అని పెద్దగా అరిచాడు శ్రీ నాగప్ప)

పీకర్ అమీరుద్దీన్ (స్పీకర్ స్థానం నుంచి): సిగ్గు—సిగ్గు అనకూడదు.

శ్రీ నాగప్ప: అలా అయితే ఉపసంహరించుకుంటున్నాను. (నవ్వు) ఒక హరిజనమంత్రి గ్రామాభివృద్ధికై మంత్రివర్గంలో ఉన్నాడు. ఆయన చేస్తున్న గ్రామాభివృద్ధి ఏమిటి.

ప్రకాశంగారు ఒకకోటి రూపాయల్ని హరిజనులకై ప్రత్యేకించారు, ఆ డబ్బుని ఖర్చుపెట్టే గౌరవంకూడా ఈ మంత్రివర్గానికి లేకపోయిందని నాగప్పగారన్నారు.

జనాబ్ సలాం: ఈ మంత్రివర్గంలో అన్నివర్గాలవారు చేరారన్నారు. ఇది ప్రజాప్రభుత్వం కాదు. నిరంకుశప్రభుత్వం ప్రధాని రాష్ట్రానికి చేస్తున్న సేవ అందరికీ తెలిసిందే. నన్ను ప్రధానిగా ఉండమంటే కొన్ని ఆలోచించేవాణ్ణి, ప్రధాని - ఆయనకు సంబంధించినవిలువకూడా ప్రకటిత పెట్టుకోలేకపోయాడు. మనకు ఈ ప్రధాని వద్దు. ఉద్యోగాల శివ్వటంలో పక్షపాతం హెచ్చింది. ఉద్యోగులు అవినీతికూడా పెరిగిపోతోందని సలాంగారు విమర్శించారు.

కె.టి.కోసల్‌రాం, హుసేన్‌సాహెబ్, ఆర్. వి. స్వామినాథన్‌గార్లు ప్రభుత్వ విధానాన్ని విమర్శిస్తూ ప్రసంగించారు. హుస్సేన్‌గారు ఈ ప్రభుత్వం కులతత్వాల ఆధారంచేసుకొని పాలన సాగిస్తున్నదన్నారు.

స్వామినాథన్‌గారు ప్రభుత్వ శాసన విధానాన్ని విమర్శించారు. ప్రకాశంగారి ప్రభుత్వాన్ని పడగొట్టి ఈ ప్రభుత్వం వచ్చినా సార్థకం లేకపోయిందన్నారు. ఏదైనా సెలెక్టుకమిటీలను వేసే, అందులో అంతా మంత్రులు ఇష్టులే ఉంటారు.

డా॥ సుబ్బరాయన్: సెలెక్టుకమిటీలను అసెంబ్లీ నియమిస్తుంది.

శ్రీ స్వామినాథన్: కాని ఆ కమిటీ సభ్యుల పేర్లను మంత్రి నిర్ణయిస్తారు.

అసెంబ్లీ ఇల్పాటోరానికి లేచింది.

## రాజరత్నం పిళ్లైపై మద్యపాననేరం

తిరుపతి, మార్చి 8: ప్రసిద్ధ నాదస్వర విద్వాంసుడు శ్రీ టి. ఎన్. రాజరత్నం పిళ్లైపైన స్థానిక పోలీసువారు నేడు మద్యనిషేధ చట్టము ననుసరించి సబ్‌మాజిస్ట్రేటు కోర్టులో కేసు దాఖలు చేసిరి. ఫిబ్రవరి 15-వ తేదిని అరెస్టు చేసి జామీనుపై వదిలిపెట్టిరి.

## రాయల్‌సీమ బాంకులో రూ 20,000 చోరీ

చిత్తూరు, మార్చి 6: నిన్న సాయంకాలము 8-9 గంటలమధ్య రాయల్‌సీమ బాంకు స్థానికశాఖ తాళాలు ఎవ్వరో ముందుగ బిగుసుపెట్టి తాళాలు తీసి సుమారు రూ 20,000 లు విలువ రూపాయిలు కరెన్సీనోట్లు దొంగిలించబడెను. పోలీసులు దర్యాప్తు చేయుచున్నారు. (స్వ.వి.)

## స్వాతంత్ర్య సమరాన్ని ప్రతిఘటించినవారికి ఉన్నత పదవులు

### అధినివేశ శాసనసభలో ప్రశ్నలకు ప్రధాని నెహ్రూ సమాధానాలు

న్యూఢిల్లీ, మార్చి 8: హోం శాఖా మంత్రి సర్దార్ పటేల్ తరఫున భారత ప్రధాని నెహ్రూ అధినివేశ శాసనసభలో ఈ రోజు దేశబంధు గుప్తాగారి ప్రశ్నకు సమాధానం ఇస్తూ, గత కొన్ని మాసాలుగా ఢిల్లీ ప్రాంతంలో అనేక బందిపోట్లు, సాయుధమూకలు ప్రజలను బలవంతపెట్టుట, పట్టపగలు దొంగతనాలు ఎక్కువగానే జరుగుతూ వచ్చినవనీ, ప్రభుత్వం గూండాలను, కాడీలను, అరెస్టు చేస్తున్నదనీ, కస్టడీ చర్యలుకూడా తీవ్రంగానే సాగుతున్నవనీ తెలియజేశాడు. అనుమానం వున్న వ్యక్తులను ఒకకంట కనిపెట్టేవున్నామనీ, పోలీసువారికి సహాయంగా పనిచేయుటానికి పెద్దమనుష్యులతో ప్రత్యేక సంఘాలు ఏర్పడినవనికూడా నెహ్రూ అన్నాడు.

### హోం గార్డులు

వివిధ రాష్ట్రాలలోనూ, ఢిల్లీలోనూ హోంగార్డుల స్థాపనను ప్రభుత్వం ప్రోత్సహించదలచినదనికూడా ప్రధాని నెహ్రూ గుప్తాగారి ప్రశ్నకు సమాధానంగా తెలియజేశాడు.

ఇండియాలో వున్న కొన్ని వార్తాపత్రికలు ఇండియాకే విరుద్ధమైన వార్తలను ప్రచారం చేస్తున్న సంగతి ప్రభుత్వానికి తెలుసునా అని ఆర్. ఆర్. దివాకర్‌గారు ప్రశ్నించారు.

ప్రభుత్వానికి అట్టి వర్తమానాలు వచ్చినవనీ, ఈవార్త ప్రచారానికి ప్రతిక్రియగా ప్రభుత్వం సాధ్యమైన చర్యలను జరుపుతున్నదనీ ప్రధాని బదులు చెప్పాడు. ఐతే ఎంత ఆగ్రహం కలిగించేవార్తలను ప్రచారంచేసినప్పటికీ, వారిపై అతి కఠినమైన చర్యలు తీసుకొనే ఉద్దేశం ప్రభుత్వానికి లేదనికూడా నెహ్రూ అన్నాడు.

### ఉద్యోగుల నియామకం

ఇండియా ప్రభుత్వం ఆఫీసర్లను నియామకంచేయడంలో భారత స్వాతంత్ర్యోద్యమకాలంలో పాల్గొన్నవారికి ఏమైనా ప్రత్యేక సదుపాయాలు కలుగజేస్తున్నారా అని సుకేంద్రమోహన్‌ఘోష్‌గారు ప్రశ్నించారు.

ప్రధాని నెహ్రూ లేదని సమాధానం చెప్పాడు.

మరికొన్ని ప్రశ్నలకు సమాధానంగా ప్రధాని నెహ్రూ కొంతమంది కేవలం బహిరంగ సమావేశాలలో ఉపన్యసించడానికి ఉపయోగిస్తారుగాని, ఆఫీసుల్లో పనిచేయడానికి ఉపయోగపడరన్నాడు

డా॥ పట్టాభి: ఇది మంత్రులకుకూడా వర్తిస్తుందా? (నవ్వు)

నెహ్రూ: కొంతవరకు వర్తిస్తుంది. (విపరీతంగా నవ్వు)

డా॥ పంజాబురావు దేశముఖ్: స్వాతంత్ర్యోద్యమానికి ప్రతిబంధకాలు కలిగించిన ఆడ్డుపడినవారికి చాలామందికి ఉన్నత పదవులు ఇస్తున్నారనే ఫిర్యాదు విన్నారా?

నెహ్రూ: దురదృష్టవంతమైన ఇటువంటి ఉదాహరణలు వున్నవనే విషయం ప్రభుత్వానికి తెలుసు

ప్రశ్న: ఢిల్లీలో మద్యపాన నిషేధం అమలుపరచే ఉద్దేశం ప్రభుత్వానికి వున్నదా?

ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ఆరోగ్య మంత్రి షణ్ముఖంచెట్టిగారు బదులు చెప్పారు.

## అధినివేశ శాసనసభలో ప్రథమ శాసనసభాధ్యక్షుని చిత్రపటావిష్కరణ

న్యూఢిల్లీ, మార్చి 8: కేంద్ర శాసనసభకు ప్రథమ స్వయంప్రతిపత్తి అధ్యక్షుడైన కీ. శే. శ్రీ విఠల్‌భాయ్ జె. పటేలుగారి చిత్రపటాన్ని నేడు అధినివేశ శాసనసభలో ఆవిష్కరించబడింది. పెషావర్ వాస్తవ్యులు అమీర్‌చంద్ బొంబ్వాల్‌గారు ఈ చిత్రపటాన్ని శాసనసభకు బహూకరించారు. పటమును శాసనసభాధ్యక్షుని కుర్చీకి ఎదురుగా గోడకు వ్రేలాడగట్టారు.

జి. వి. మవలాంకర్‌గారు మాజీ శాసనసభాధ్యక్షులైన పటేలుగారి గుణగణాలను ప్రశంసిస్తూ చాలా క్లిష్టపరిస్థితులలో ఆయన అధ్యక్షపదవిని అలంకరించవలసి వచ్చెననీ, రాజ్యాంగ రంగంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ప్రతికూలంగా ఆయన సాగించిన పోరాటము, ఆయన ప్రదర్శించిన త్యాగసాహసాలు చిరస్మరణీయాలనీ అన్నాడు.

తెలుగు భాషాసమితి కార్యాలయ ప్రారంభోత్సవము మద్రాసు యూనివర్సిటీ భవనములో 9 వ తేది మంగళవారం ఉదయం 8-30 గంటలకు జరుపబడును. తెలుగు విజ్ఞాన సర్వస్వ ప్రచురణ విషయమై చర్చించుటకుగాను సాయంత్రం 5 30 గం. లకు తెలుగు భాషాభిమానుల సమావేశం జరుగును.

## గాంధిజీ స్మారక చిహ్న సమస్య

### దేశమంతటినుంచీ అసంఖ్యాక సూచనలు

న్యూఢిల్లీ, మార్చి 6: గాంధీజీ స్మృతి చిరకాలం స్థిరంగావుండిపోవాలని భారతీయులు ఇప్పుడు తగిన స్మారకచిహ్నం కోసం ప్రయత్నిస్తున్నట్టుగా ప్రపంచంలో మరేదేశమూ, ఎప్పుడూ ఏ వొక్క మనిషికోసమూ ఇంతగా ప్రయత్నించలేదు. చిత్రవిచిత్రాలుగా సూచనలు వివిధ ప్రాంతాలనుంచి ఇంకా వస్తూనేవున్నవి. కొన్ని సూచనలు ఇట్లావున్నాయి. రోడ్లపేర్లు, పేటలపేర్లు మార్చాలనీ; దేవాలయాలు, మందిరాలు, సూపాలు కట్టాలని, పాఠశాలలు, వైద్యశాలలు, ఆటస్థలాలు, చిత్రశాలలు, మ్యూజియములు స్థాపించాలనీ; విగ్రహాలు నిర్మించాలనీ; నాణెములపై, తపాలాబిళ్లలపై ముద్రించాలనీ సూచిస్తున్నారు. ఈ తరహా లోనే కొంచెం ఎక్కువ ఆకాశంలో ఢిల్లీ బొంబాయిలపేర్లు మార్చాలనీ తూర్పుపంజాబు నూతన రాజధాని గాంధీ నామాంకితం చేయాలనీ; అత్యున్నతమైన ఎవరెస్టు శిఖరానికి గాంధీశిఖరం అని పేరు పెట్టాలనీ, భారతదేశాన్ని గాంధీస్థాన్ అని పిలవాలనీ, హిందూమతాన్ని గాంధీమతం అనాలనీ సూచిస్తున్నారు.

గాంధీశకం స్థాపించాలని అధికసంఖ్యాకులు సూచిస్తున్నారు. కాని దీనికి గాంధీజీ జన్మదినమును పరిగణించాలా, మరణదినమును గణించాలా అన్నదితో సమస్య గానే వుంది.

బిర్లాభవనమును అన్ని మతాలకూ చెందిన దేవాలయంగా ఏర్పరచాలని కొందరు, జాతీయపతాకంలో గాంధీ బొమ్మ, అశోకచక్రంబదులు చరఖా వుండాలని కొందరు వాదిస్తున్నారు.

ఐక్యరాజ్యసమితి తరఫున ఒక గాంధీ సమితి ఏర్పాటుచేసి ప్రపంచదేశాలన్నిటికీ అహింసను ప్రబోధిస్తూవుండాలని కొందరు

రాజ్‌ఘాట్ యమునాతీరంలో ప్రపంచాద్భుతాలలో ఒకటిగా లెక్కింపబడే ఒక దేవాలయం నిర్మించాలనీ, 99 మంది కలసి ఒక్కొక్కరు లక్ష రూపాయల చొప్పున ఇస్తే తాను ఒక లక్ష యిస్తాననీ, కోటి రూపాయలతో ఆలయ నిర్మాణం జరుపవచ్చునని ఒక సి. పి. రాష్ట్ర ధనికుడు ప్రకటించాడు.

తాజ్‌మహల్‌వంటి ఒక గాంధీ మహల్ కట్టాలనీ, దానిముందు పెద్ద ఖాళీస్థలము వుంచి లండన్ వెస్ట్‌మినిస్టర్ అబీలోవలె ప్రముఖభారతీయులు మరణించినప్పుడల్లా ఇక్కడ వారికి సమాధులు నిర్మించవచ్చునని ఒకరి సూచన.

## కార్మిక ప్రజల జీవనాభ్యున్నతి

బొంబాయి, మార్చి 7: గత డిసెంబరులో ఢిల్లీయందు కార్మికుల ప్రతినిధులు ప్రభుత్వ ప్రతినిధులు గావించుకొన్న పారిశ్రామిక శాంతి ఒడంబడికను భా. జా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యవర్గమువారు సంతసము వెలిబుచ్చి, వదను తీర్మానములో ఏకగ్రీవముగా గావింపబడిన సలహాలను రూపొందించు కృషి జరుగనందుకు సంతాపము వెలిబుచ్చిరి. ఉత్పత్తి పెంచుటలో కార్మికులకు ఉత్సాహము కలిగించుటకు పరిశ్రమలలో కార్మికులను భాగస్వాములుగా చేయవలెననిరి. కార్మికులకు గృహవసతులు కల్పింపవలెననిరి. గ్రాజ్యుయేట్ పద్ధతి ద్వారా వారికి క్రమముగా న్యాయమైన వేతనములభ్యమగునట్లు చేయవలెనని ప్రభుత్వమువారిని కోరిరి. ట్రేడ్ యూనియను వారు పారిశ్రామిక శాంతి పథకంలో పాల్గొన్నప్పటికీ వారి శాంతి ఆశలను ధ్వంసము చేసిరని, సమ్మెలు పునర్వచించరని సభవారు చెప్పుచు యట్టి ప్రయత్నములకు కార్మికులు లోనుకారాదని హెచ్చరించిరి. పాతిక్రామిక తగాదాల చట్టములోని లోపము లను పరిష్కరించవలెనని సభవారు ప్రభుత్వమువారిని కోరిరి. మహాత్ముని నిర్యాణమునకు సభవారు అపరిమితమైన సంతాపము వెలిబుచ్చిరి. మహాత్ముడు దేశీయ కార్మికోద్యమ సంస్థాపకాచార్యుడని, కార్మికులను వారి పోరాటములో ఉత్సాహము కలిగించుచుండెడివాడని తీర్మానము తెలిపెను. గాంధిమహాత్ముని స్మారక చిహ్నంగా అహింసా, సత్యము, న్యాయములపై ఆధారపడు సాంఘికవ్యవస్థ నేర్పరుపవలెననిరి. జౌళ్ల పరిశ్రమయందలి పనివారి కూలీలు చాలా అసంతృప్తికరముగా నున్నవని సభవారు చెప్పుచు ఈకూలి విషయమై పరిశీలించుటకు ప్రభుత్వంవారు ఒక సంఘమేర్పరుపవలెనని కోరిరి. వైశ్యతనవారి జీతముల విషయమున విజ్ఞప్తి గావింపుటకు రికగ్నిషను పొందిన యూనియను లన్నిటికీ అవకాశము యొసగవలెనని సభవారు కోరిరి. అంతర్జాతీయ కార్మికసభకు, ఢిల్లీలో ఏప్రిలులో జరగనున్న త్రిపక్షసభకు వారు ప్రతినిధుల నెన్నుకొనిరి. ఆ. ప్రై

